# అంకితము

ఎవఁ డహింసారణ వ్యవసాయదీక్షలో
విశ్రుతత్యాగ మావిష్కరించె
ఎవఁ డార్తసేవనప్రవణుఁడై "ఆత్మవత్
సర్వభూతాని" యన్ సత్యమెఱిఁగె
ఎవఁడు భారతమహోర్వి ఘూర్జరతపస్వి
యుల్ల మువ్వెత్తుగాఁ గొల్లలాడె
ఎవఁ డహంతాలేశ మెఱుఁగనియోగియై
తెలుఁగునాఁటికి మేటివెలుఁగు లిచ్చె

నతని కెర్పెనిసత్కృలోద్యానవన వ
సంతునకు నస్మదమృతోక్తిసజ్జకావ్య
గుచ్ఛమిది కాన్కగావింతు నచ్ఛశీల
మండితునకు సుబ్రహ్మణ్య పండితునకు

# స్వతంత్రభారతము

జయచంద్రుఁ డపగతక్షాత్రుఁ డానాఁడు
రగులుకొల్పిన చిచ్చురవ లేచి యేచి
యఖిలభారతభూమి నల్లార్చియార్చి
యిన్నాళ్ళకిన్నాళ్ళ కిట్టింకులింకె —
ఈ దవానలమార్ప నీదాస్యమడఁప
నెత్తురోడ్చిన శూరనివహమ్ము పేర
నురికంబమెక్కిన యోధులపేరఁ
బూనవోయీ! మల్లెపూలదోసిళ్ళ
పాడవోయీ! వీరభక్తిగీతాలు —
కులవర్గములు పెంచు క్రుళ్ళింతలేని
మతపిశాచంబుల మనుగడలేని
ధనవద్దరిద్రభేదచ్ఛాయలేని
పరులకూటికిమూఁగు బదనికల్ లేని
విద్యావిహీను లేవీధిలోలేని
దైన్యరేఖలకు నాధారంబులేని
జీవత్సమాజంబు సృష్టిగావించి
తమ్ముఁడా! నీతేరు తరలింపవోయి!
మనపురాణమహస్సు మరలింపవోయి!

౧౫—౮—౪౭

# మన రాష్ట్రము

ఏటికో దిక్కుమాలిన యీ జోహార్లు
దేనికో సిగ్గులేని యీదేవురింపు
లేలొకో రాయబారముల్ బేలమొగము
లిస్సిరో రాష్ట్రలబ్ధికా యింతరగడ

ఎవ్వఁడాదాత మనరాష్ట్ర మిచ్చిపంప
వరములిడ నెవ్వఁ డాలోకవల్లభుండు
యాచనాదైన్యమెఱుఁగని యాంధ్రజాతి
యింత దిగజాఱునే యెంత వింతపుట్టె

ఎండమావులవెంటఁ బర్వెత్తనేల
మేఁకమెడచంటి కీపాటి మెప్పులేల
యరసి యాత్మావలోకన మాచరింపఁ
డదిగో మనముక్తి మనచేతియందెకలదు

మూఁగలై యింతకాలంబు మూలడాఁగి
రెవ్వ రాయన్న లీనాఁడిదేమిరాష్ట్ర
భక్తియో పొత్తుకలియనిపాట కడుగు
త్రొక్కి సాగించుచున్నారు చెక్కభజన

పెత్తనంబువలచు పెద్ద లీరీతి బా
కాల నూఁదుకొంద్రు గగనమదర
నిక్కమైనసేవ నెఱపెడీపిన్నలు
కంటఁబడరు సెనగపంటవోలె

ఏలమురిసెద వీ సెలయేటిచిలిపి
గంతులకు నొజ్జలగు మాటకాంద్రఁజూచి
తగరు దేశమ్ము పాలింపఁదగరు పజల
కన్నుగప్పి జీవింతురీ కన్నగాంద్రు

నలువదేండ్ల తపస్సు లీనాఁడు పండి
తరతరాలతమస్సులు విరిసి విరిసి
యిదె సమీపించె నాంధ్రరాజ్యేంది రావ
తరణసుముహూర్త మఖిలార్థకరణమగుచు

సోదరా ! విక్రమౌదార్యవేదివగుచు
మండలకులాభిమానముల్ మంటఁగలిపి
మాతృసేవాపరాయణ త్యాగ్లానదీక్ష
నవధరింపఁగదోయి నాయంకరంబు

కలరు పొలిమేరదొంగలు కలరు తేనె
పూఁతపూసినకత్తులు నీ తెనుంగు
గడ్డకై యెందఱెందఱో చెడ్డవారు
వేచియున్నారు కనుగల్గి కాచుకొమ్ము

## పెద్దకాపు

కమ్మమెట్టోరుఁగల్ తెలంగాణ మెల్ల
నీదిరా, గోలకొండ నీపాదిరా, త్రి
లింగభూమిరా, కోలారు బెంగుళూరు
సేల మాలూరు వేలూరు చెన్నపురము

లోకవిశ్రుతులౌ ఘనకాకతీయు
లేలు రాజ్యమురా బస్తరెవ్వ రెవ్వ
రెంత పెనఁగిన విడువకోయీ! తెనుంగు
తల్లి పంటపొలమ్ము "చాందా"స్థలమ్ము

౯—౧—౪౮

## మా యూ రు

ప్రచలితస్వాతంత్ర్యరణవీరకాహళీరుతిరాణ్మహర్మ్యహర్మ్యముఖరితంబు
జాతీయవిద్యాప్రచారసంతోషితబ్రాహ్మీచిరంతనధర్మపీఠి
సాబర్మతీయోగిసమ్రాణ్మహాశీఃపరంపరాదానపాత్రప్రవృత్తి
సేవాతపఃక్రియాజీవాతుమండలీవిశ్రుతవినయాశ్రమాశ్రయంబు

మధురశీలపరిస్ఫూయమానతరుణ
వృద్ధనారీనరచ్ఛటావేష్టితంబు
మఱపునకురాదు "కావూరు" మామకీన
గాఢతరపుణ్యరుక్సూచి కాణయాచి

౨౦—౫—౪౭

# ఆవేదన

అతఁడు తెల్గులతల్లి పుణ్యమ్ముపంట
యతఁడు తెల్గులబాస భాగ్యంపురాశి
యతఁడు కవిరాజు సంఖ్యావదగ్రగణ్యుఁ
డేల పుంభావభారతియే యతండు

అతని గంభీర కవితా రహస్య మెఱిఁగి
మేలు మేలనువారు వేల్వేలె కాని
బెగ్గడిలి యీసంబెత్తి ప్రగ్గుచున్న
వారు లక్షలు లక్ష లున్నారు జగతి

కల్పమునఁబోని యుత్తమకావ్యసృష్టి
దాని కలవోక, వాణి యవ్వానిరాణి
యతనికి వచోవిధేయమై యఖిలశాస్త్ర
పటలమది భీతిమై బరాబరులొనర్పు

అతఁడు పల్కిన పల్కు పాటై ధ్వనించె
నతఁడు వాక్రుచ్చు వాక్యంబు హారి కావ్య
రాజమై దేశదేశాల రాణకెక్కె
నతని హృది రసవాహినియై తొణంకె

అతఁడు మహాకవిత్వ దీక్షావలంబి
యగుచు నంతర్విలోకనం బట్టె విప్ప
యుగ యుగమ్ములు దాఁటిన జగములెల్ల
రివ్వు రివ్వున సాక్షాత్కరించితీరు

రంగ దుత్తుంగ వీచీ పరంపరాంచ
దభ్ర గంగాప్రవాహమ్ము ననుకరించి
సజ్జనశ్లాఘనీయమై ముజ్జగంబు
చుట్టివచ్చు సమాసంబు కట్టు నతఁడు

కుకవులకు నాతని విమర్శ గుండె గాల
మల్పబుద్ధుల కేనాఁటి కందఁ డతఁడు
ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన పండితుండు
పండితుఁడె కాదు పండితాఖండలుండు

తెలుఁగుహృదయమ్మునందున్న తీపినెఱిఁగి
తెలుఁగునుడికార మందున్న మెలపు నెఱిఁగి
తెలుఁగుసంస్కృతియందున్న చెలువమెఱిఁగి
తెలుఁగున కతండు సరిక్రొత్తవెలుఁగు లిచ్చె

పెటపెటార్భటుల దిక్తటులు వ్రయ్యలువాఱఁ జిచ్చఱపిడుగులం జిమ్మునొకట
నానందమాధుర్య మది సోడుముట్టఁగాఁ దీయని తేనె లందించునొకట
జగమెల్లఁ బులకించి సొగయు నట్టులు కమ్మపసిగాలితరఁగల విసరునొకట
జంతుకోటికి నూత్నచైతన్యము నొసంగు తఱపివెన్నెల చాలు పఱపునొకట

సౌరుల కౌహారు తెఱగంటిసానిచేత
విశ్వమోహన గీతికల్ వెల్లివిరియ
తీపి చివురింప నాట్యమాడించు నొకట
నాతనికి లేదు దుష్ప్రాప మను గుణంబు

ఇంతటి కవీంద్రు లేమిడి యిట్టిదనుచుఁ
జెప్పుటకు నాదు లేఖిని సిగ్గువడియె
నిస్సిరో ! యెంత దుష్కాల మో తెలుంగు
జాతిలోఁ జీమునెత్తురుల్ సచ్చెనొక్కొ

రాజరా జీగడ్డపై జన్మమెత్తెనా యేలినాఁడా రాయ లీ పొలంబు
సర్వజ్ఞసింగ మిచ్చటి గాలిపీల్చెనా భాస్కరుం డీ నేల బ్రదికినాఁడె
తిక్కన్నగంట మీ దిబ్బపై మొరసెనా పెద్దన్న యిచ్చోటఁ బెరిఁగెనొక్కొ
కవిసార్వభౌముఁ డిక్కడ మెప్పులందెనా వేమభూవిభుఁ డిందు వెలసెనోటు

కటకటా! నేఁటి కివి స్వప్నగాథ లయ్యెఁ
దులసివనమందె గంజాయి మొలకలెత్తె
నెన్ని నాళ్ళుండు నాంధ్రున కీ తమస్సు
కలదె యేనాఁటికైన మోక్షంబు మనకు

కవితా రసాస్వాద కౌతుకవ్యగ్రులై దండయాత్రలు నిల్పు దండిదొరలు
రమణీయకావ్య సారస్వతావేశులై కవుల పల్లకిమోయు నవని విభులు
తెల్లవారకముందె దినవెచ్చముల నంపి కృతికర్తలను గొల్చు పృథివిపతులు
కనకాభిషేక సత్కారమ్ములర్పించి కవికృపావిభవంబు గాంచు ప్రభులు

నృపుల యౌదార్యమునకు వన్నియలొసంగి
శారదాపూజ లొనరించు సచివమణులు
నేఁటి కవిశేఖరుని దైన్యపాటు సూచి
కుములుచున్నారు చచ్చి స్వర్గముననుండి

బెంగాలీ కృతికర్త పాదముల కర్పించు న్నమస్కార ము
ఖ్యాంగుం బారసి లేఖినీ విలసనంబుల్చూచి, రావయ్య ! నా
బంగారంబ ! యటంచు నాంగ్లకవి నాహ్వానించు నే పాపమో
రంగా ! మెచ్చఁడు తెల్గుబిడ్డ కవిసమ్రాట్టున్ స్వదేశీయునిన్

బ్రదికిననాళ్లు దుర్భరాపదలఁ గుడిపి
చచ్చినంతనె యాత్మకు శాంతివల్కి
వీరపూజలు గావించు వెఱ్ఱితనము
తెలుఁగు దద్దమ్మకే సమృద్ధిగ లభించె

ఇది వెఱ్ఱితనంబని ప
ల్కుదునా మఱి తోడివాని గుణగౌరవ సం
పద కోర్వలేని నైచ్యా
స్పద మీర్ష్యాదాస్యమనుచుఁ బ్రకటించెదనా !

లోక మితనికి నేవమ్ము గాకమున్నె
యాఁకటికి డస్సి జీవముల్ పోకమున్నె
పట్టుఁడీ ! బ్రహ్మరథము నీ భావుకునకు
నవల నేడ్చిన లాభ మావంత లేదు

చవియు సారంబు నెఱుఁగని చచ్చుకవులు
పుట్టకొక్కులవలె సదా పుట్టుచుంద్రు
సర్వతంత్ర స్వతంత్రుఁడౌ సత్కవీంద్రుఁ
డెన్నఁడో కల్పమున కొక్కఁడే లభించు

౮—౨—౩౮

## శివకర్షకుఁడు

చదలేటి నీటిసంపద రిత్తవోనీక సిగముడి నానకట్టగ నమర్చి
యల జాహ్నవీముఖ్యములు చిన్నపెదకాల్వ లఖిలభారతభూమి నల్లుకొల్పి
ముక్కారుపంటల ముద్దుపెక్కెంబనఁ గేల ముమ్మొనల ముల్కోల నూఁది
మెడమువ్వపాటలో నొడలఁ బుల్కలు రేఁగ బసవన్న నసివాఱుపనికిఁ బనిచి

యిల్లు వెండియు బంగారు విల్లుగాఁగఁ
బండి కైవ్రాలినజగమ్ము పంటపొలము
కావలికి ఘోరసర్పకంకణము గట్టు
శివుని మాపెద్దకాఁపు నర్చింప రండు

౩౦—౧—౪౫

పెద్ద కాపు

నృపుల యౌదార్యమునకు వన్నియలొసంగి
శారదాపూజ లొనరించు సచివమణులు
నేఁటి కవిశేఖరుని దైన్యపాటు సూచి
కుములుచున్నారు చచ్చి స్వర్గమునుండి

బెంగాలీ కృతికర్త పాదముల కర్పించు నృమస్కార ము
ప్పొంగుం బారసి లేఖినీ విలసనంబుల్సూచి, రావయ్య ! నా
బంగారంబ ! యటంచు నాంగ్లకవి నాహ్వానించు నే పాపమో
రంగా ! మెచ్చఁడు తెల్గుబిడ్డ కవిసమ్రాట్టుంగా స్వదేశీయునిన్

బ్రదికినన్నాళ్లు దుర్భరాపదలఁ గుడిపి
చచ్చినంతనె యాత్మకు శాంతివల్కి
వీరపూజలు గావించు వెఱ్ఱితనము
తెలుఁగు దద్దమ్మకే సమృద్ధిగ లభించె

ఇది వెఱ్ఱితనంబని ప
ల్కుదునా మఱి తోడివాని గుణగౌరవ సం
పద కోర్వలేని నైచ్యా
స్పద మీర్ష్యాదాస్యమనుచుఁ బ్రకటించెదనా !

లోక మితనికి నేవమ్మ గాకమున్నె
యాఁకటికి డస్సి జీవముల్ పోకమున్నె
పట్టుఁడీ ! బ్రహ్మరథము నీ భావుకునకు
నవల నేడ్చిన లాభ మావంత లేదు

చవియు సారంబు నెఱుఁగని చచ్చుకవులు
పుట్టకొక్కులవలె సదా పుట్టుచుంద్రు
సర్వతంత్ర స్వతంత్రుఁడౌ సత్కవీంద్రుఁ
డెన్నఁడో కల్పమున కొక్కఁడే లభించు

౯—౨—౩౮

## శివకర్షకుఁడు

చదలేటి నీటిసంపద రిత్తవోనీక సిగముడి నానకట్టగ నమర్చి
యల జాహ్నవీముఖ్యములు చిన్నపెదకాల్వ లఖిలభారతభూమి నల్లుకొల్పి
ముక్కారుపంటల ముద్దుటెక్కెంబనఁ గేల ముమ్మొనల ములుకోల నూఁది
మెడమువ్వపాటలో నొడలఁ బుల్కలురేఁగ బసవన్న నసివాఱుపనికిఁ బనిచి

యిల్లు వెండియు బంగారు విల్లుగాఁగఁ
బండి కైవ్రాలినజగమ్ము పంటపొలము
కావలికి ఘోరసర్పకంకణము గట్టు
శివుని మాపెద్దకాఁపు నర్చింప రండు

౩౦—౧—౪౫

## 'సర్వోత్తమ గీతి

కడలుకొని దాస్యశృంఖలా కాళరాత్రి
ముసురుకొల్పు తమస్సులో ముసుఁగుదిద్ది
కాలు బిగఁదన్ని రేలుపగళ్లు మఱచి
తరతరమ్ములు శతశతాబ్దములు దాఁటి
గుట్టుపెట్టుచున్న తెల్గుం బొలమ్ము
దశదిశల నొక్కపెట్టున దద్దరిల్లఁ
గొసరి మేల్కొల్పు పాడిన కోడిపుంజు

* * *

నీచ పరతంత్రతాపిశాచీ చిరత్న
గర్వ నిర్వాసనారబ్ధ కదనకేళి
నోడిగిల్లని రక్త మెవ్వాఁడు మోయు
నతఁడు కశ్మల జలవాహిన్యైన, పాడు
గుంటయని వీరగీతమ్ము క్రోల్చిక్రోల్చి
కులముచెవిత్రుప్పు ఢుల్చిన కోకిలమ్ము

* * *

రగిలిరగిలి పైకొన్న పరప్రభుత్వ
రోష దావానల చ్ఛటారుంద్రధాటి

కోహటిల్లక పిడుగుల నురవడించి
గర్జచేసిన తొలితెల్గు కాఱుమబ్బు

* * *

తూర్పు పడమర లెఱుఁగక తొలకరించు
మార్పు తెలియక వేఁడి నిట్టూర్పులూర్చు
తెలుఁగు సంసారమును గాంచి కలముపూని
సారవిజ్ఞాన చంద్రికాపూర మాంధ్ర
జగతి వెల్లిగొల్పిన కళాసాగరమ్ము

* * *

శారదాపాద హైమ మంజీరనాద
కాంచికారత్న కింకిణీ క్రమగీత
పులకితమ్ముల జనపదమ్ముల రచించి
లలిత విశ్రుతి నార్జించు తెలుఁగువీణ

* * *

పేరుపెంపులులేక యేఁకారుచున్న
యఱవపితలాటమున నిచ్చ లణఁగుచున్న
కష్టజనకంబు నుమ్మడి కాఁపురంబు
నీఁదలే కాదరించు దిక్కేదియున్న
తల్లి దైన్యముసూచి స్వార్థమ్ముఁద్రోచి
రాష్ట్రనిర్మాణ దీక్షారిరక్ష నాంధ్ర
జనమహోద్యమ స్యందన సారథిత్వ
భరము పూనిన తెల్గుల పసిఁడికొండ

పెద్ద కాపు

* * *

గాడిచర్ల కులార్ణవ కౌస్తుభంబు
తెలుఁగుఁ దోఁటను విరిసిన వెలఁదిమల్లె
యగుచు మన, హరిసర్వోత్తమాభిధానుఁ
డఱువది వసంతముల పెంపుననుభవించి
మూఁడుకోట్ల తెలుంగు లీనాఁడు పొంగఁ
బంచిపెట్టెను సంక్రాంతిపర్వ సుఖము

* * *

వీరపూజా మహోత్సవావిష్టులగుచు
నారతులు పట్టిరాంధ్రు లుదారమతులు
జయజయారావ మింటింట సందడించె
నక్షరానంద మింటింట నవతరించె

* * *

మాతృసేవాపరాయణ మనసుఁడగుచు
దేశగౌరవ రక్షణోద్రిక్తుఁడగుచు
లోకకల్యాణ కృత్క్రియాలోలుఁడగుచు
నీదృశమహోత్సవంబు లెన్నేని బడసి
తెలుఁగు వీరుఁడితండు వర్ధిల్లుఁగాక!
తెలుఁగు తల్లికిఁ దనివి సంధించుఁగాక!

౧౦—౧—౪౮

5

## దౌ ర త న ము

తొలుసంజఁ బుట్టు నాజ్ఞలకు బైసిదొటంగి మలుసంజ నపరకర్మంబు సలిపి
కలపాశములఁదగులొ్కని శుంఠలనుబిల్చి యుత్తాలపదవిఁగూర్చుండఁబనిచి
లంచాలగడ్డికాసించి లోకులఁగ్రుమ్మ నధికారిపశువుల కచ్చుపోసి
చీఁకటిబేరముల్ సృష్టించి పేదనెత్తురు పీల్చు రక్కసి నురకవిడిచి

పరువు దక్కించుకొన్నట్టి దౌరతనంబు
లేదు భువనత్రయంబులో లేదు లేదు
చెప్పనేటికి విద్యావిశిష్టుఁడైన
మంత్రిముంగడ ధర్మమర్మంబులెత్తి

౨౦—౫—౪౭

## మ ద్య పి శా చి

ఆద్యపవిత్రజీవితము నల్లరిపాలొనరించి లోక నీ
తిద్యుతులార్పి కయ్యముల దింపి దరిద్రత నంటఁగట్టి ధీ
విద్యుదఖండరోచి నొక వ్రేల్మిడి లోన హరించినట్టి యీ
మద్యపిశాచికిన్ బ్రళయమంత్రము పాడితిమయ్య నేఁటికిన్

౧—౧౦—౪౭

పా ద ధూ ళి

అది దురాశాపిశాచీ సమర్చన ప్ర
భూత సవన బృహద్భాను హేతి వదన
హుతదయాధర్మములకు, నరాకృతి నివిష్ట
దుష్ట రక్షస్సులకు, జగద్ధూమకేతు
వులకుఁ గేతువులకు వణిక్కులకు నిలయ —
మది నిరంకుశక్షామ దురంత దర్ప
రాగ్రహావేశ వికటాట్టహాస జవన
గమనవిన్యాసముల కసంఖ్యాత సాధు
మానవీ మానవచ్ఛటా ప్రాణమాన
రాశి బలివోయినట్టి నిర్భాగ్యదేశ —
మది మహాభూతవేతాళమదవతీ ప
రంపరా రూక్షఖడ్గనిర్యత్ ప్రభా స
ముజ్జ్వలద్దంష్ట్రియై మృత్యు వుగ్ర దీర్ఘ
జిహ్వలార్చుచు వాహ్యాళి చేసినట్టి
రంగ — మది మదిఁ గరఁగించు వంగభూమి

* * *

సత్యకంకటధరుఁ డహింసాకృపాణి
శాంతిరణవీరమండలీచక్రవర్తి
మోహనుఁడు విశ్వకల్యాణమూలమూర్తి

జాలికి వెన్నెలవైన యీ నేలఁ జూడఁ
గదలె భగవానుఁ డార్తరక్షతపస్వి

* * *

గుండెలో నగ్నిగోళముల్ మండి వ్రేల
నూర్పులో మూఁడులోకమ్ము లూఁగియాడఁ
జూపులో నెయ్యతియ్యాల సోన లురలఁ
బలుకులో నవజీవసంపదలు పండఁ
బల్లియలు పట్టణంబు లాప్రభువు చూచె

* * *

తటిసె ఋషిరాజు "రాంపుర" ద్వారవేది
బలసె నా బాలవృద్ధ ప్రపంచ మతని
నెరసె నాశాద్యుతుల్ ప్రజానేత్రవీధి
మొరసె జయజయధ్వని దిశామూల మదరఁ
గురిసె యోగీంద్రు శిరముపైఁ గుసుమవృష్టి

* * *

పౌరు లేతన్మహోజాత పారవశ్య
మగ్నులై యున్నవేళ డింభకు డొకండు
పరుగుమైవచ్చి తత్సభా ప్రాంగణమ్ము
డాసి జర్జరితమ్ము కూర్పాసమూడ్చి
మూటకట్టఁదొడంగె నచ్చోటి దుమ్ము

* * *

ఏమిరా వెఱ్ఱి పాపఁడా యీ ప్రజా స
ముద్ర మిటు పొంగి మిన్నులు ముట్టుచుండ

దృష్టి సారింపవైతి వాదిశకు నీవు
సాగి దర్శింప వాకర్మయోగిచంద్రు
నేల ముడిచెద వీపాంసుజాల మిచట

* * *

అయ్యగారూ నమోవాక మమ్మహాత్ముఁ
గంటి నేనఃపిశాచికం గదలుమంటి
హరిజనత్రాత నా స్వామి యడుగుసోఁకి
పరమ పావిత్ర్య లక్ష్మివిభాసియైన
యీ రజోరాశి జననికై యెత్తుచుంటి

* * *

అమ్మ నన్నీసదస్సున కనుచువేళ
దివ్యపూరుష చరణ బాంధవ్యమంది
పతితపావనపాద సంపర్కమంది
సుకృత సురభిళమైన పాంసువును దెచ్చి
దుఃఖ నిస్తారకంబైన ధూళి దెచ్చి
యస్మదీయము పరితాప మార్చుమనియె

* * *

మున్నొకమహాత్ము నడుగుదుమ్మునకు నోఁచి
కఠినశిల పూవుఁబోఁడియై కదలెనంట
ఘోర జానుషబంధముల్ కోసెనంట
బాబయా! యిమ్మహాత్ముని పదమునంటు
దుమ్ముచే గెంటలేమె మాదుర్విపత్తి

* * *

దీనబాంధవురూపమ్ము దెల్పుమంచు
వేషభాషావిశిష్టతల్ వినుపుమంచుఁ
జేష్టితమ్ములు వర్ణించి చెప్పుమంచుఁ
దల్లి ననుఁబంప జన్మ సార్థక్యమొదవె
సాక్షిగావచ్చెఁ గనుము బాష్పప్రవంతి

* * *

నా సవిత్రి నా సోదరి నగ్నలగుచు
గుడిసెనున్నారు జేనెఁడు గుడ్డలేక
కుములుచున్నారు బ్రతుకు వ్రేఁగునకునోడి
యడలుచున్నారు ప్రత్యక్షమైన వేల్పు
దెసకుఁ గనువిప్పలేని దుస్థితికి లోఁగి

* * *

జనకుఁడెందుండెనందువా జఠరకోశ
మెరియుచున్నది నీకు నుత్తరమొసంగ
నంబలియులేక రోగాల నడ్డలేక
యాలుబిడ్డల కన్నీటి నార్పలేక
స్రుక్కి మము దిక్కులేని పక్షులనుజేసి
యతఁడు దుర్భిక్షవహ్ని కాహుతిగమారి
పోయె ననిపత్రశిక్షావిధేయహేయ
విత్తదాసులకొక నవ్వు విసరి కొసరి
పిలుచు నమరేంద్రు గద్దెపైఁ గొలువుదీర

* * *

పఱియలై వ్రీలె నాగుండె బాలకా ! త్వ
దీయ కథ లీదృశంబులా ! దీనతా ని
మగ్నులకు మీకు మిమువంటి మానవాలి
కిట్టి దుర్యోగ మిఁక లిత్తయేని నిల్వ
దిట్టి దుష్కాలమిఁక నెన్నఁడేని డాయ
దిది పరాధీనతాఫలం బిది నికృష్ట
దాస్యఫల మస్వతంత్రతా దారుణాంధ
తమసమును జీల్చ మాతృత్రాణదమనజన్య
ధన్యతగడింప నేఁడు సోదర్యులెల్ల
నడుముగట్టిరి ప్రాణము ల్మడుపుగట్టి
రడఁచి రాత్మీయకులమతాహంకరణము
విడిచి రీర్ష్యామషీజుష్ట వీక్షణమ్ము
నలఁది రుష్ణాంగి వీరగంధావలేప
మగ్గలించి రహింసారణాంగణమున
నెత్తిరి త్రివర్ణశోభితామృతపతాక
నొత్తి రొక్కుమ్మడిగ దేవదత్త కుహర
మంతిపుర ముజ్జగించి శౌర్యాచ్ఛరేఖ
లింతు లెసరేఁగి వీరతాయెతులుగట్టి
కుసుమపూవన్నె వల్వము లుత్తరించి
మాతృసేవాపరాయ ణామ్లానదీక్ష
శిక్షితాత్మలు ధీరలక్ష్మీ సనాథ
లపరదుర్గలు రుద్రాంబ లగుచు నగుచుఁ

గలని కహామహామికతోడఁ గదలివచ్చి
రెవ్వరీ యోద్ధృమండలి నెదిరినిల్చి
ద్రఢిమగల మగ లెవ్వరీ తరుణభార
త స్రవంతి నిరాఘాట ధాటికోర్చి
దమ్మగలబంటు లదిగో స్వతంత్రతార్క-
మండలారుణరోచిస్సమాజ ముదయ
పర్వతప్రస్థభూమిఁ గ్రొం బసిడిజల్లు
చల్లుచుఁ విజయోత్సవ సమయసిద్ధి
సూచియయ్యెఁ బ్రసన్నతల్ పూచిదెసల
వెల్లివొడిచె హుటాహుటి నిల్లుసేరి
తల్లి కీమేలుపల్కు చూతప్రవాళ
తోరణము కట్టవోయి! మందారకుసుమ
హారమిది తాల్పవోయి! దీర్ఘాయురర్థ-
భారములు మోయవోయి! నవ్య స్వతంత్ర
భారతము నేలవోయి బంగారుతండ్రి!

౨౪-౧౨-౪౭

# సేవాధర్మము

[ కాళిదాసు ననుసరించి ]

దిలీపుఁడు వసిష్ఠుం జేరి తన యనపత్యతకు వగవ, నా ఋషీంద్రుఁ డతని నోదార్చి “ నా హోమధేనువును నందినిని బూజింపు మదియ నీ యాప్సితంబు నొసంగు ” ననవుడు మహీపాలుఁ డా మొదవును భక్తిమై సేవింపఁ జాగె నొక్కనాఁ డా గిడ్డి నడవికిఁ దోలుకొనిపోయిన —

మనుజవిభుండు దుష్టమృగమండలి ధేనువునీడ నేనియుం
గనకుఁడు దుశ్శకంబనుచుఁ జిత్తమునం దలపోసి చెంగటం
దనరు మహీధ్రమౌళి సముదంచితశోభలు కాంచువేళ నే
పునఁ జనుదెంచి పైదుమికి బోరననీడ్చె మృగేంద్ర మగ్గవిఁ

గుహలు మాఱు సెలఁగ గో వప్పుడఱచిన
యార్పు దీనబంధువగు నృపాలు
శైలసక్తదృష్టి సరగమరల్చెఁ బ
గ్గాలఁబట్టి యీడ్చు కరణితోఁప

ధాతుమయమైన కొండ నెత్తమ్మునందుఁ
బూచియేచిన లొద్దుగుపోల్కి నెఱ్ఱఁ
దనము నెగఁజిమ్ము కుఱ్ఱిపైఁ దాండవించు
తెల్లమెకమునుగాంచె న వ్విల్లుదాల్పు

అంత మృగేంద్రగామియు జితారియు నార్తశరణ్యుఁడైన భూ
కాంతుఁడు స్వప్రమాదమునఁ గల్గిన చెట్టకుఁ సిగ్గుచెంది దు
స్స్వాంతము వధ్యమైన మృగవల్లభముం దెగటార్పఁగా నిషం
గాంతర శస్త్రముల్ దివియ నాసపడె న్గడు నల్కఁ తొల్కఁగన్

చిత్తరువునందు దిద్దితీర్చిన విధానఁ
గదలదయ్యె నవ్వీరునికరము నఖర
కాంతినికరపరిచ్ఛన్న కంకపత్ర
శరశిరోబాంధవత్యాగసహముగాక

తన కరంబట్లు మ్రోడువాఱిన వివృద్ధ
రోషుఁ డారాజు మాంత్రికరుద్ధవీర్య
భోగియై చెంతఁగల మార్తుఁ బొదువలేని
తన ప్రతాపమ్ముచే లోనఁ దగులఁబడియె

తనయున్కికి వెఱఁగందెడు
మనుకులమణి సింహసత్త్వమాన్యునిగని ం
ట్లనెఁ గేసరి నరభాషల
జనపాలుఁ డవేలచిత్రచకితుఁడు గాఁగన్

ఏల వృథాశ్రమించెదు నరేశ్వర! నీ విశిఖంబువచ్చినన్
జాలదు నన్నుఁగూల్ప నిది సత్యమ యంబరచుంబిపాద పో
న్మూలన కౌశలమ్మునకు నోఁచిన మారుతుఁ డెంత నిక్కినన్
శైలమునూఁపునా విమతసార మెఱుంగక విక్రమింతురా?

పెద్దకాపు

శివుఁడు రజతాచలంబు నాఁజెల్లఁగు నాము
పెద్దు నెక్కుచుఁ బాదంబు నింత మోపి
దయఁ బవిత్రమొనర్చు నీ దాసునడుము
నధిప ! నన్నుఁ గుంభోదరుఁడంద్రు జనులు

శివుఁడు ముద్దుసేయు చిన్నారిపాప యీ
దేవదారు, వళవుదేవి దీనిఁ
బెనిచె మేల్మి పసిఁడి బిందెలతోడఁ దె
చ్చినపయస్సువోసి చిన్ననాఁడు

చెక్కుటి తీఁట నడంపఁగ
నొక్క వనేభంబురుద్దె నొకపరి దీనిన్
రక్కసిములుక్కులఁజిక్కిన
యక్కొమరుంగూర్చివోలె నపు డుమ వగచెన్

అదిమొద లోనృపాల! వనహస్తి భయంపడ నన్ను సింగపుం
గొదమనుజేసి యీతుహిన గోత్ర గుహాగృహవాసమిచ్చి నన్
గదిసెడి సత్వకోటి నెరగా నియమించెఁ బినాకపాణి య
మ్మొదలఁ దలన్ ధరించి సతమున్నెఱవేర్తు మదీయధర్మమున్

శంభు నిర్దిష్ట భోజనసమయమగుచు
నాకుఁ జిక్కిన యీ కుఱ్ఱినల్లఁజేసి
క్షుధితుఁడగు రాహు వైందవసుధనుబోలెఁ
దనివిసెందెద నేఁడు గోత్రాకళత్ర !

శస్త్రసాధ్యంబుగాని రక్ష్యమును విడువఁ
దలఁగిపోవునాకో ధనుర్ధరుల కీర్తి
యోపినకొలంది గురుభక్తి చూపినట్టి
నీకు సిగ్గేల యిఁకఁబొమ్ము నెలవుసేర

మృగరాజిట్లు వచించిన
ప్రగల్భవాక్యములు విని నృపాలుండు నిజా
శుగ మిట్లడఁగుట శివుచే
తఁగదాయని విడిచె నాత్మఁదగిలిన రీథ౯

అతఁడు బాణప్రయోగభగ్నాదిమప్ర
యత్నుఁడై కులిశంబునేయం గడంగి
నాఁడు ముక్కంటిచూపుచే మోడువాఱు
నింద్రుఁబలె నిల్చి కేసరి నిట్లుపలికె

సింగమ ! వినుమిబ్భంగిని
భంగంపడినట్టి యేను బల్కెడినుడి న
వ్వంగఁ దగినదియ; యైనఁ బ
రేంగిత మీ వెఱుఁగుదానవే యని వినుత౯

జగములెల్లనేలు చంద్రవంశ్యుడుఁడో
యన్న ! నాకుఁ బూజ్యుఁడగునుగాని
యాహితాగ్ని గురుని యావిట్లుత్రుంగుచు
నెదుటనుంటసూచి యెట్లు సైఁతు

అట్లగుట నీవు నాదేహమారగించి
యాఁకటిం బాపికొమ్ము పాయంతనమున
కమ్మకొఱకు నంబాయని యఱచు లేఁగఁ
దలఁచి పిడుము ఋషికులోత్తమునిసురభి

ఒడయని యీపల్కులు విని
పడఁకులచీఁకటులు తొలఁగఁబాఱ న్నగి య
వ్వెడఁద మొగంపు మెకం బీ
వడువున వాక్రుచ్చె నవనివల్లభుతోడన్

ఎదురుగొడుగులేని యేలికతనమును
క్రొత్తజవ్వనంబు గొనబుమేని
నల్పమైన లాభమాసించి విడిచెద
వెంత మూఢబుద్ధివీవు నృపతి !

భూతదయ నీకుఁ గలదేనిఁ జేతమందు
నరయు మీపల్కు నీవు మైఁదొరఁగ, నొక్క
మొదవె జీవించు నటుగాక బ్రదుకుదేని
జనకువలె నెల్లప్రాణుల సాఁకనోర్తు

గురుఁడు శిఖితుల్యుఁడతని కొక్కండెమొదవు
దాని విడిచిన నతని శాపానఁబడుదు
నంచు వెఱచెదె ? తద్దోషమార్చుపొంతె
నీకు మందలులేవె దుగ్ధాకరములు

అట్లగుట నెల్లశుభముల ననుభవించు
నీ బలిష్ఠ శరీరంబు నిలిపికొమ్ము
మనుజనాథ ! భూస్పర్శనమాత్రభిన్న
శాతమన్యవపదము రాజ్యం బనంగ

సింగ మిటుపల్క విరమింప శీతగిరియు
జనవరేణ్యున కట్ల యుచ్చైస్స్వనమునఁ
జెప్పెనో యనఁ గందరాసీమవలన
మారుఁబోవుచు వెల్వడె మాఱుమ్రోఁత

శివకింకరుఁ డిట్లన మా
నవనాథుఁడు భీతలోచనమ్ములతోఁ ద
న్నవలోకించెడి గురుధే
నువుపైఁ గడుజాలి నొంది నుడివె న్మగుడన్

క్షత్రపదమ్ము గదా మద్
గోత్రమ్మునపేరు దీని గు ట్టెఱిఁగియు నా
పీ త్రోవ నుండ విడిచి ధ
రిత్రీ రాజ్యంబు నెటు వరింతు మృగేంద్రా !

లాఁతిమొదవుల నొసఁగి యేరీతిఁ దబిసి
మంట చల్లార్తు నిది వేల్పుదంటగిడ్డి
కంటె వెల్తిదిగాదు ముక్కంటికరుణ
యుంట నీ తొడుకుం బట్టుకొంటి వీవు

నా యొడలి న్వెలగా నిడి
యీ యావుం బ్రోచుటొప్పు నిటు లొనరింపన్
నీయశనార్తిచను న్మని
రాయని హోమాదివిధుల రాయిడి తొలఁగున్

రక్ష్యమును మిత్తికిడి శరీరంబు గాయ
పడని సేవకుఁ డెటు నిల్చుఁ బ్రభువు నెదుట
నీవు నొకయయ్యకడఁ గొల్వు నెఱపవోటు ?
లేదె నీకును నాకావులీల మ్రాఁకు

ఏ నవధ్యుఁడ నని యెంతువేని మద్య
శోంగరక్షణ సేయుమీ యంగమంది
బుద్బుదప్రాయమును బంచభూతమయము
నైన మేనిపై మముబోఁటు లాసపడరు

మాటలాడికొంట మైత్రికి మూలమా
మైత్రి పాదుకొనియె మనకు నిచటఁ
గాన మిత్రుకోరికను జిన్నవుచ్చుట
నీకుఁ దగదు భూతనేతృదాస !

అనుడు నుపాంగి విడిచె సింహంబు కుత్తి
నపుడ నృపబాహునిర్బంధ మడఁగె నంత
ముక్తశస్త్రుఁడు నిజదేహమును మృగేంద్ర
మున కొసఁగె రాజు మాంసంపుముద్దఁబోలె

'అప్పు డధోముఖుఁడై నరేంద్రాగ్రసరుఁడు
ఘోరసింహనిపాతమ్ము కొఱకు నెదురు
సూచుచుండఁగ నతనిపై నేచి కురిసె
నమరహస్త విముక్త లతాంత వృష్టి

అంత లేవఁగదోయి వత్సా యటంచు
నమృతమయి వాణి చెవిసోక నవనిభర్త
లేచి పొల్చేపి తన తల్లిలీల నున్న
సురభిఁగనె మ్రోల సింగంబు సురిఁగిపోయె

ఎంతయు నబ్బురంపడు నరేంద్రున కిట్టులు పల్కె గోవు నీ
స్వాంత మెఱుంగ సాధుజనసత్తమ ! సింగమనైతి నేన న
న్నంతకుఁడేని డాయ భయమందు ఋషీంద్రుని శక్తి నన్ను నిం
కెంత తదన్యఘాతుకము లించుక నీవ తలంచి చూడుమా

నీ దయకును గురుభక్తికి
నాదగు హృది పల్లవించినది దుగ్ధంబే
కాదెట్టి కోర్కెనేనియు
నీఁదగుదుఁ బ్రసన్ననైన నేను గుమారా !

పదపడి మానితార్థి నిజబాహుసమార్జిత వీరశబ్దుఁడై
పొదలిన యవ్విభుండు కరము ల్ముకుళించి కులాభివర్ధనున్
సదమల నిత్యకీర్తి విలసచ్చరితున్ సుతునిమ్మటంచు న
మ్మొదవును వేఁడె నేఁడు వ్రతముల్ ఫలియించె నటంచు నుబ్బుచున్.

## పెద్దకాపు

మెచ్చితిఁ గుమార ! నీ వర
మిచ్చితి నని పల్కి—ధేను విదె త్రావుము నా
మెచ్చని పాలని మేలని
సచ్చరితున కానతిచ్చె జనపాలునకున్

౪—౧౨—౩౦

## పాములపాటి

పాలించితివి గర్తపట్టణమండలం బఖిలాంధ్ర జయరావ ముఖరితముగ
నెలకొల్పితివి సీమఁగల పల్లెపల్లెకు నున్నత విద్యాప్రయోగశాల•
పోషించితివి నైకభాషామనీషుల నుద్యోగ సద్యోగయుతులఁ జేసి
చిత్రించితివి ప్రజాసేవానురక్తుల పాలింటి యొజ్జయౌ మేలిబాట

గడనచేసితి హరిదంతకరికపోల
తటపరద్వాఃకణప్రీతచటులమధుప
గీతము యశస్సు ; వేంకటకృష్ణసుకృతి !
తావకము జీవనం బహో ! ధన్యతమము

౩—౧౨—౪౬

# మేలిపల్కు

వరుఁడు — తోఁటకూర కృష్ణమూర్తి

వధువు — సామ్రాజ్యము

దయనీయజగదభ్యుదయకారకత్యాగఖనియైన సిద్ధార్థమునిపినాకి ఖండఖండాంతరఖ్యాతవిజ్ఞానవారధి వివేకానందబుధవరుండు పరతంత్రతాతమఃపటలీవిపాటనక్రతువిధాతృఁడు గుజ్జరాతియోగి లోకైకశౌర్యరేఖాకామనీయకభ్రాజిష్ణుజీవనప్రభుఁడు బోసు

కులికి రేతల్లి జోలపాటలకు మెచ్చి
పలికి రేతల్లి నేర్పిన వెలఁదిపల్కు
నమ్మహేశ్వరి విశ్వకల్యాణదాత్రి
భారతసవిత్రి మనుచు దంపతుల సతము.

మేలు మేల్ మున్ను పాళెమ్ము లేలి యేలి
నేఁడు సామ్రాజ్యమునకు మన్నీఁడవైతి
కృష్ణ ! యధికారగర్వ మొక్కింత లేక
రంజకత నేర్చి కీర్తిపారమ్ము గనుమ !

ఇంత వెలవకమ్మ యితఁడు నీచేతికి
దొరకినట్టి లేఁత తోఁటకూర
పులుసుపిండి నీకు వలసినచందాన
వాడవచ్చు రుచులు చూడవచ్చు

పెద్దకాపు

కామసపర్య సల్పు పశుకల్పు లధర్మవిధారతుల్ ప్రజా
క్షేమ విరోధు లిమ్మహి నిసీ! కలరెందు నిసుళ్లగుంపులై
ప్రేమకు నర్చచేసి తమపెం పఖిలమ్మును విశ్వమానవ
శ్రీముదుపఘ్నమంచు విహరించినవారు గదా! జగన్నుతుల్

సంపదకుఁ మనీషకును జాలినవారలు మీరు; కాని, మీ
సొంపులుగుల్కు మేడదరి సోలుచు సోలెఁడు జొన్నగింజలుఁ
గొంపను లేనిపేద నెలకొన్నతఱిఁ సుఖమెట్లు మీకు నో
దంపతులార! పూనవలదా తలదాఁపక సంఘసేవకుఁ

శాస్త్రకర్త జమీందారు సాహుకారు
బేరి యధికారి యేకమై పేదవాని
సృష్టిచేసిరి తేనెపూసినకటార్లు
నీతి గఱపుఁడు వీరి కేరీతి నేని

ఒకవంక నీర్ష్యధాటికిఁ దట్టుకొనలేక కమ్మసంఘముగుండె కదలిపోయె
ఒకవంక బహునేతృ హుంకారములఁజిక్కి తలయెత్తలేకుండెఁదెలుఁగుజాతి
ఒకవంక నటవమాయకులోఁగిమనరాష్ట్రియత్నమన్నదియథాయథలయయ్యె
ఒకవంక రాజకీయోరువిప్లవఝరీమగ్నయై కలఁగె సామ్రాజ్యలక్ష్మి

కనుఁడు కావలసినయంత కార్యభార
మెదురుగా నున్నయది — భీతి యింతలేక
దీక్షపూనుఁడు ధర్మసంరక్ష కొఱకు
నాలు మగలార! మీకు దీర్ఘాయురస్తు

౨౧—౪—౪౭

శ్రీ

## ముక్త్యాలమాలిక ౧

( రాకొమరుని జన్మదినోత్సవముపట్ల )

" హిమకరుఁ దొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయ వం
శమున'' నటన్న భారతవిశాంపతిఁగన్న చళుక్యవంశ — మాం
ధ్రమునకు విశ్వతోముఖ ముదాత్తత నించినవంశ — ముత్తమో
త్తమనరపాలవంశము పదంపడి తావకవంశమయ్యె నం
చమలమతుల్ పురాంధ్ర చరితాంతరవేత్తలు నిర్ధరించుటన్
సముచితమై తనర్చెఁగద చంద్రకుమారమహీశ ! నీదుపే
రమృతమయూఖసంతతికి నక్షరజీవిత మబ్బుటబ్రమా
కమలయనుంగుటల్లుని కఖండధనప్రతిపత్తి చోద్యమా
ప్రమథులనేలుసామితలపైఁ గులుకంగలవాని చొక్కపుం
గొమరుఁడు లోకమాన్యతను గొంట విచిత్రమె యోషధీశువం
శమున కనామయప్రభలు దక్కుట విస్మయమా బుధానుజం
దమరకవిత్వసాహితుల కాకరమౌటది యద్భుతంబె చం
ద్రమునిసుతుండు విశ్వజనతాపరితాపములార్చి పూజ్యతా
క్షముఁడగు టేమిలెక్క సడిసన్నకలానిధివంశ మందచం
దములకు నిక్కయౌట యరుదా వరణీయగుణంబులెల్ల సా
జములయిపొల్చెనీ కిఁక నొసంగెడి దీవనయేమి ధన్యతా
సముదయమూర్తివీవు ప్రభుచక్రవతంసుల శాతవాహ భూ
రమణులదండఁ గొల్వయి పురామహిమమ్ములు నాఁచికొన్న రా

పె ద్ద కా పు

జ్యముగద నీది సహ్యతనయాలహరీపరిశీతవాతముల్
దిమిదిమిసేయఁగా నివతళించుఁగదా భవదుర్వి దుర్విధిం
జమరి నితాంతనిర్వృతులొసంగి జగంబులనేలువేలు పా
నమదమరుండు వేదగిరినాధుఁడు నీ మొగసాలపారిజా
తముగద సర్వమంగళవిధాయి భవాని భవన్నిలింపర
త్నముగద రామభారతకథాకలితాంధ్రమహాకృతిద్వయీ
రమణుఁడు నీకుఁ దాతగద రాజకులంబున కోజబంతియై
క్షమఁగల విద్వదగ్రణుల సత్కవిసింహులఁ బిల్చి మెచ్చి వి
త్తములిడు రామకృష్ణవసుధాపతి తండ్రి గదయ్య నీకు ని
ట్లమరిన యాభిజాత్యలత కల్లికపెట్టెదవీవు నీకథా
క్రమములు దివ్యకావ్యములుగా సుకవుల్ సృజియింత్రు రాట్సుతా !

౨౨—౧౨—౪౪

## ముక్త్యాలమాలిక – ౨

( రాజసన్మాన సందర్భమున)

గండరగండలై శ్రుతిసుఖప్రద సాధుకథామచర్చికా
ఖండనులై మహిష్ఠగరిమం జతురబ్ధిపరీతమేదినీ
మండలభర్తలై భువనమాన్యత నొంచిన తెల్గువారిలో
దండియశమ్ము నేలిన సదస్సులకెక్కిన వాసిరెడ్డిరా
ణ్మండలిపుణ్యవృత్తసుషమాపరిపూతము తెల్గునేల త
ద్భండనపాటవమ్ము ప్రతిపక్షభయంకరమౌట నన్యదో
శ్చండిమలేక శాంతిసుఖసంపద కిమ్మయి దక్షిణాపథం
బుండెనటన్న పల్కు నెదురొడ్డఁగ నాఁడునునేఁడు నేరికిం
గుండెలులేవు వారల యకుంఠితవిక్రమకంకటమ్ముతో
నెండసి తీవిగాంచి జగదీడిత హైందవధర్మ మిచ్చటం
బండువులాచరించుకొను భాగ్యమునందెఁ దదీయదాతృతా
ఖండితదైన్యులై తనివిగాంచినయాచకు లగ్రహార వే
దండతురంగహేమమణిదానములం బరితుష్టిసంపదల్
మెండుకొనందలిర్చిన యమేయమనీషులు సత్కవిప్రభుల్
పండితు లార్షధర్మపరిపాలితబుద్ధులు సోమపీథులం
నిండనిపల్లె లాంధ్రధరణింగన మాస్తికతారిరక్షమైఁ
బిండులుగట్టి శిల్పములు పింపిసలాడఁగ వీరిమాతృభూ
ఖండమునందునిల్పు శివకైటభజిద్గృహరాజినెన్న శే

షుండునుజాలఁ డిద్ధగుణశోభితమైతగు వీరికోవలోఁ
బండిన రామకృష్ణనరపాలక ! నీ సుతుజన్మపర్వ ము
ద్దండవిభూతిమైవెలయు దానిఁ గనుంగొను భాగ్యమబ్బి నా
కండలుపొంగె మేనఁబులకల్మొలకెత్తె నఖండహర్షమై
తాండవకేళిసల్పెడిఁగదాహృదయమ్ము. త్రిలింగరాజమా
ర్తండుల వాసిరెడ్డివసుధాపురుహూతుల వైభవంబులఁ
బెండియుపెండియుంగనెడు వేడ్కలుపుట్టు టదేమివింత యీ
పండుగు వర్షవర్షపరిపాటి సహస్రముగానెసంగ నీ
కండగనిల్చు వేదకుధరాగ్రవిహర్త జగద్ధితక్రియా
శౌండుఁడు నారసింహుఁడు ప్రసాదమ్ముదూకృతలోచనద్వయీ
చండి యజాండభృజ్జఠరి శాంకరి కింకరమందిరాంగణా
ఖండలశాఖి నిర్భరసుఖమ్ముల నిన్నలరించు మీఁగడన్
నిండిన రత్నరాజిరవణించిన యింటినిసుంగుచల్వ నీ
బండరు వెల్లవేళల నపారధనాశ్రయమౌచు జాళువా
కొండనదల్చు మాన్యకవికుంజరపుంజము లంధ్రభారతీ
కుండలముల్ కిరీటములు క్రొవ్విరిదండ లనల్పకల్పనా
భాండములైన కావ్యములఁ బాడి నినుందనుపారఁజేయు నీ
తండిరి చంద్రమౌళివసుధాపతి కచ్ఛయశోవిభాసికిన్
బెండెరమున్నసత్కవులఁ బెంచినకావ్యకళావినోదికిన్
రెండవ రాజరాజునకు నీ కవితారతి సమ్ముదశ్రువాః
కాండములూర్చు నీసుతుల కమ్మనిమన్ననడ గన్నవారికిం
బండులు బోరనం బులియఁబాఱు భవద్భవనావళుల్ సుహృత్

తండముతోడ బంధుసముదాయముతోడఁ బెనంగి భేరికా
డిండిమ కాహళీధ్వనులు డీకొని సందడిసేయ లేఁత యి
ల్లాండ్రు పికీనినాదముల నారతి పాటలుపాడ నిండుగా
వండిన భక్ష్యభోజ్యముల వాసన లాసలు పెంప సర్వదా
పెండిలి వేడ్కలన్మునిఁగి పెంపుగుఁ జింతలపాటి రాజ్య మొం
డొండ తనర్చి నిత్యవిజయోత్సవ కందమగఁ హిరణ్యముల్
మండెలువైచి నీప్రజలు మాన్యచరిత్రల కాశ్రయంబులై
వేంద్రములేని డెందముల వేమఱు నిన్వినుతింతు రద్రికో
దండపటీరహీరహిమధామశరజ్జలముగ్వియద్ధునీ
కాండ మరుద్గవీకనకగర్భవధూఫణిరాజమల్లికా
పాండురకీర్తి నిన్వలచి పార్థివకోటికి నీర్ష్యపెంచు రా
రండని పిల్చి గౌరవధురానతదృక్కులు పంచి సాహితీ
మండితులైన సత్కవుల మాదృశులఁ దనియించు నీకథా
మండల మొజ్జయై ధనికమార్గములఁ నవరించు భూపతీ !

* * *

కొండొక విన్నవింతు వినఁగూడని కబ్బములల్లి గ్రామ్యముల్
బండులు బండ్లు నింపి కవిపాంసను లాద్యకవీంద్రమార్గముల్
దుండగికమ్మునఁ దెగడుదుర్గద బందరువాల్ఫిరంగిలో
మండలు ముందు లెల్ల కసుమాలపుఁజెత్తయుఁ గ్రుక్కునట్టు లీ
బండలు భారతిం బఱచి వల్మఱునువ్వుదు "రేంది కాంది కూ
కోండి తెలీదు రాం డిహా లెగుం" దని వ్రాసెద రెల్లకట్టులఁ
దుండెలు సేయకున్న నుడితొయ్యలి రెక్కొనదందు రెట్లు వా

పెద్ద కాపు

కొండు రటుల్ రచించుటయ కూడునటందు రిదేమి యేటికిన్
గండులు పెట్టి స్వేచ్ఛనిడఁగాఁ దగునన్న బొలంబులుం గొటా
ర్లిండులు పల్లెలుం బురము లెల్లయు వెల్లువబారి కగ్గమై
వండలి దిబ్బలై సమయవా? కరకట్ట ప్రవాహజీవికన్
జెండునె? సూర్యసోములను జేడ్పడఁజేసెనె కాలబంధముల్
గండరు వందచందములఁ గాఱియపెట్టి నగన్ నలంచెనా?
పెండిలి సౌఖ్యముల్తుడిచిపెట్టె నెలంతుక నంగలారుపుం
ఖండలిఁ జేసెనా? పసులబీటికిఁ గంచెలు గోష్ఠశాలకుం
బెండెము లేనిచో మొదవుపిండు సుఖించునె దుర్విదగ్ధతా
పిండితబుద్ధు లాంధ్యపరిపీడితు లిత్తఱి నవ్యసాహితీ
షండ సపర్యలోఁ బెరిఁగి సత్యమెఱుంగక వెంగళప్పలై
బెండులు పల్కి రిత్తవెడబీరముచూపెద రీప్రసక్తిలో
మండఁ దొడంగు నాహృదయమండల మక్కట. తెల్గుతల్లి కీ
పుండులు మానునట్లు పనిఁబూను ముసుళ్లనఁ గ్రేళ్లువాఱు నీ
దండు నధఃకరించి కవితావనితాశుచితామనోజ్ఞతల్
గొండిలిసల్పునట్టి తెఱఁగుల్ పచరింపఁగదయ్య సాధుశీ
లుండు రసజ్ఞుఁడుం దెలుఁగులోఁతు లెఱింగినప్రోఢ రాజమా
న్యుం డెలమావివంగడమునోఁచిన నోములమేలిపంట నీ
దండ నమాత్యుఁడయ్యెనుగదా శివరామమనీషి సాహితీ
కండువు నీకునుంగలదు గాన మదీయమనోరథాప్తి కే
వండయు రాదటంచు వగవాసెదఁ జేఁదులడంగి తీయ మేల్
పండులు తెల్గుదోఁటఁ దెగఁబండునటుల్ ప్రయతింపవయ్య కై

దండలొసంగుచుఁ నిను బుధప్రకరమ్ము భజించి హర్షముల్
పిండును భట్టుతిక్కనలు ప్రెగ్గడపెద్దనసూరనాదికుల్
పండితచిత్తు లాంధ్రకవితాపరమేష్ఠులు పారిజాతపుం
జెండులుపంపి నీకుఁగయిసేఁతలుగూర్తురు రాజ్ఞరేంద్రుఁడుం
గుండలినేలినట్టి ప్రభుకుంజరుఁ డన్యదురాసదప్రథఁ
డిండిమభట్టుబింకమును డించు మహాకవిపై వరాలమేల్
గిండులు క్రుమ్మరించునృపకేసరి వేమనరేంద్రుఁ డంధ్రభో
జుండు సిరంగరాయలు యశోనిలయుల్ రఘునాథరాణ్ముఖుల్
తీండ్రలుతక్క శాంతిజలధి న్మనుకల్పచరింత్రు నానుడుల్
కొండికపల్కులంచనక కోత్తలసేయఁగదయ్య కీరుతుల్
పండునునీకు "మీకవనపాండితిఁజూపి నితాంతసమ్మదం
బిండని కూర్మిపేర్మివెలయించి మహీపతు లెందఱెందఱో
గండెలవంటికాఁప్ర లధికారులు కోరుచునున్న నేదియో
మొండితనమ్ముఁదెల్పి పదముగ్గదలింపనియట్టినేను నీ
రెండవపిల్పుతో ననువరించినకోరిక లంధ్రశారదా
గండసరద్దురశ్రుజలఖండవిరోధులు నీకతమ్మునం
బండునటంచునెంచి పొగబండులరాయిడిసైఁచి రోగముల్ ।
పొండని ధిక్కృతుల్పలికి పూనినకర్జములాఁపి యెట్టిటో
యెండకువానకోర్చి ధరణీశ్వర । వచ్చితి మాతృసేవ నీ
గండువెలార్చి నాదుకుతుకంబునుదీర్పవె తెల్గువాణి కి
పాండువడంగునట్లు నడపంగదె యార్షరసాయనంబు పె
క్కండ్రు మహామహాల్పడిన కష్టముపంటగ నేఁడొ రేపొ రా

## పెద్దకాపు

నుండినతెల్గురాష్ట్రము శుభోత్తరమై విలసిల్లుపోంబెఁ ద
చ్చండతరప్రతాపము దిశావలయమ్మును దాఁటుపోంబె వే
ధోండము దాని సభ్యతకు నారతులిచ్చిభజించుపోంబెఁ బా
షండమతప్రచారములుస్రగ్గి జగద్ధితమబ్బుపోంబె నాం
ధ్రుండు విశిష్టధర్మబలధూర్వహుఁ డన్నుడినిల్చుపోంబె నే
న్నండొ తొలంగిచన్ విలసనంబులు శారదకబ్బుపోంబె నే
తండును వ్రేలుసూపనివిధంబునదిద్దవె రాష్ట్రవాణి నీ
గండముఁదూల్చి బాసకు వికాసమొసంగు వఱంతివీవ యె
వ్వండిది కాదటంచు నిలువంగలఁ డట్లగుటన్ సుధీకవుల్
దండకపద్యగద్యసముదాయములం బొగడం గడానిపూ
దండలునింపి వాణినిఁకఁ దన్పవె ముక్తిపురీమహేశ్వరా!

౨౩—౧౨—౪౪

## మాధవపెద్ది

ఎందఱులేరు నేఁడు సుకవీంద్రు లఖండకవిత్వరాజ్యసం
క్రందను లంధ్రవిశ్వజనగౌరవభాజను లట్టివారిలో
నెందఱకబ్బె నీకు లభియించిన యించిన కూర్పునేర్పు లో
సుందరరామశాస్త్రి! నినుఁ జూచుటె పండువు తెల్గువానికిన్

# కర్ణుఁడు

దీక్షన్ పాండవ ధార్తరాష్ట్రులకు సంధింగూర్చి విశ్వప్రజా
రక్షం జేయఁ దలంచి కౌరవసభారంగమ్మునన్ నీతివాగ్
దక్షత్వంబును జూపి శౌరి తనవాదంబెల్ల వమ్మౌట స
ర్వక్షోభంబులు నీకుఁ దప్పవని రారాజున్ దుటారించుచున్

అరదముసెక్కి పోవుసమయంబున నంబుజనాభువెంట సు
స్థిరతరభక్తిఁ గుంభజనదీసుతముఖ్యులురా ముకుందుఁ డా
దరమున వారిలన్ నిలిపి ధన్యుని గర్ణునిజీరి తేరిపై
సరసను నిల్పి యిట్లనెఁ బ్రసన్నవచోవిభవాభి రాముఁడై

కర్ణా ! నీవఖిలార్థవేదివని పల్కంజెల్లదే యైన నా
కర్ణింపందగు నాదుపల్కులవి మేల్గావించు భాస్వద్వరో
దీర్ణత్వంబున నీవుపుట్టితివి కుంతీకన్యకుం దొల్లి సం
పూర్ణప్రేమను సూతదంపతులు నిన్ బోషించి రిన్నాళులున్

ఆకారణమున ని న్నీ
లోకులు సూతుఁగ మనమ్ములో నెంతురు సు
శ్లోకుండగు కౌంతేయున
కీ కరణిన్ నీచనామమేలా చెపుమా !

దుష్టాగ్రేసరు ధార్తరాష్ట్రు నిటు లెంతో భక్తిసేవించి నీ
శిష్టత్వంబునకుం గళంకమిడి వాసింబాసి భూభృత్కృపా
దృష్టింగోరుదువేని ధర్మరతులై దీపించువా రిస్సిరో
కష్టాచారుఁడు భానుసూనువని శంకంబాసి నిందింపరా ?

రాజద్భారత సార్వభౌమపదవిన్ రాణించి సర్వక్షమా
రాజస్తోమకిరీట సంఘటిత సద్రత్నప్రభాపుంజ వి
భ్రాజత్పాదుఁడవై సమస్తజన సంభావ్యుండవై వెల్గున
ట్లేఁ జేయించెద నీదుసోదరులచే నేతెమ్ము కుంతీసుతా !

తమ్ములఁగూడి యెంతయు ముదమ్మున భారతసార్వభౌమ పీ
ఠమ్ము నలంకరించి నికటమ్మున ధర్మసుతుండు చామరం
బిమ్ముగవీవ వాయుసుతుఁ డెల్లనిబట్టఁ గిరీటి సారథి
త్వమ్మొనరింపఁ గుజ్జులిరువంకలఁ గొల్వ వెలుంగుటొప్పదే ?

అఖిల లక్షణ లక్షితాంగి పాంచాలి నిన్నాఱవ భర్తగా నభిమతించు
నిన్నుఁ గన్నతల్లి కుంతీదేవి దీనికై యెంతేని మదిలోన సంతసించు
నిఖిల బాంధవ మిత్ర నివహంబు నీరాక కనుపమానందంబు ననుభవించు
లోకైకశౌర్యు లస్తోకసద్గుణధుర్యులగు పాండవేయు లాహా ! యటందు

రిందుఁకు నించుకేనియు సందియంబు
చెందఁ బనిలేదు రాజ్యలక్ష్మీకరాబ్జ
సంగ్రహం బొనరించి శశ్వద్విభూతి
నతులవిఖ్యాతి గాంచవయ్యా ! సునీతి !

అనినం గర్ణుఁడు కృష్ణుఁగాంచి వినయవ్యాపారమేపార ని
ట్లను దుర్వాసమునీంద్రునింగొలిచి తా నాదిత్యమంత్రంబు నే
ర్చి ననుంగన్నియనాఁడు గొంతికనె నన్వృత్తాంతమొక్కింత నే
వినియున్నాఁడ మహాత్మ! సర్వజగతీవిద్యోతితప్రాభవా!

కన్యాత్వంబున కంతరాయమకటా కల్గెంగదాయంచు సౌ
జన్యశ్రీనిధి కుంతి చింతపడి వాత్సల్యంబువోనాడి న
న్నన్యాయ్యంబనుచుందలంపక ప్రవాహంబందు నైవం జగ
న్మాన్యుం డత్తఱిఁ దెచ్చె సూతుఁ డనుకంపానిఘ్నచిత్తంబునన్

అల్లారుముద్దుగాఁ దన
యిల్లాలును దాను బుత్త్రిఁడీతండని నన్
జల్లగఁబెంచెను మేనం
బెల్లుగ మలమూత్రరాశి పెనఁగొనుచుండన్

కుంతీపుత్త్రుఁడ క్షత్త్రివంశజుఁడ నాకున్మీకు సంబంధమా
వంతైనంగలదా? యటంచు నను బాల్యంబాదిగాఁబెంచి య
త్యంత ప్రేమముఁజూపువారి నిపు డన్యాయ్యంబుగావీడి ని
శ్చింతన్ బాండవులందుఁజేరిన జనుల్ "ఛీ" యంచు నిందింపరే?

బద్ధప్రేమ నితండు సూతుఁడనుచుం బాటింపకత్యంత సం
శుద్ధ స్వాంతతఁజేరదీసి ధరణీశుంజేసి దుర్యోధనుం
డిద్ధత్వంబొనగూర్చె నన్ సచివుఁగా నేలంగ, యుద్ధంబు సం
సిద్ధంబైనతఱిన్ విరుద్ధమతి నిన్నీ వీడి రాఁజెల్లునే?

ఏను గిరీటి నోర్తునని యెంతయునమ్మికఁ గౌరవేంద్రుఁ డ
వ్వానిక నాపయిన్నిలిపి పొంగుచునుండు నిరంతరంబు న
ద్దానిని వమ్ముచేసి దురితంబున కిప్డొడిగట్టి పాండు భూ
జానికుమారులం గలియు సాహసమెట్లొనరింతు మాధవా!

దుర్వారోద్యమశౌర్యవీర్యవిలసద్దోర్గర్వమేపార గం
ధర్వాదుల్ దివిఁ బాడ సంగరకళాతత్త్వంబు దీపింపఁగా
సర్వోర్వీశులు మెచ్చఁ బార్థుని మహోత్సాహంబునందాఁకి యు
ద్ధోర్విన్ గ్రీడయొనర్పకున్న నగరాక్కో లోకులీకర్ణునిన్

నేనున్నాఁడ నిఁకేమిలోటనుచుఁ దా నిర్భీతిమై నాజికిం
బూనెం గౌరవభర్త పాండవులతోఁ బోటెత్తి; యిప్పట్టునం
దే నేరీతి సుయోధనున్విడుతు నీ యెగ్గెట్లు సైరింతు నా
హా! నష్టేటను బుట్టిముంచుపని యార్యశ్రేణి మన్నించునా?

ప్రజకుం దల్లియు దండ్రియున్ గురుఁడు భూపాలుండెకా వానిపై
నిజభక్తిం బ్రకటించు నెవ్వఁడతఁడే నిక్కంబుగాఁ బుణ్యుఁ డా
సుజనుండేతగు నిందునందును సుఖస్తోమంబునందంగ దా
సజనాధీన! యెఱింగి యేపగిది రాజద్రోహముంబూనుదున్

చతురంభోనిధి మేఖలాఖిల మహీసామ్రాజ్యసింహాసన
స్థితుఁగావించెద రమ్మటందువిపుడిస్సీ! లజ్జకుంబాసి దు
ర్మతినై స్వార్థమునందుఁజిక్కి యవమారంభంబులంటాని శా
శ్వతదుష్కీర్తిగడింతునా? రవిసుతవ్యాపార మీపాటిదా?

శరదంభోధరచంచలాచపలమీసామ్రాజ్యభోగంబు కుం
జరకర్ణాంతవిలోలమంగ మిఁక నా సంవర్తకాలంబు సు
స్థిరమై ప్రస్తవనీయమై విమలమై చెల్వొందు నక్కీర్తి యిం
దఱయన్ దేనిఁ బరిగ్రహింపఁదగుఁ గృష్ణా! యానతీయంగదే!

ఇన్నాళ్లాతని యుప్పు పప్పు పులుసెంతే మెక్కితిన్ బాస లె
న్నెన్నో చేసితిఁ "బ్రాణమానములు నీవే నమ్ము"మంచుంటి నో
యన్నా! యిత్తఱి నక్కురుప్రవరు నన్యాయ్యంబుగా దుఃఖసం
పన్నుంజేసిన ఘోరదుర్గతులు సంప్రాప్తింపవే మాధవా!

అక్షీణంబగు దీక్షనన్మనిచి విద్యాబుద్ధులంగూర్చి స
ర్వక్షేమంబు లొసంగినట్టి నృపతిన్ వర్జించి దుర్వృత్తి నీ
రక్షఃకృత్యమొనర్తునేని తుదకున్ రాఁబోవు మేలెద్ది? సీ
భిక్షావృత్తిఁ జరించుటొప్పదె గుణాబ్ధీ! లోకముల్మెచ్చఁగన్!

స్వామిద్రోహ మొనర్చి సర్వధరణీచక్రంబుఁ బాలించి దు
ర్వ్యామోహంబును బెంచి నింద్యమగు పేరార్జించి జీవింపఁగా
నేమాత్రంబును సమ్మతింప దనుజారీ! రాజభక్తిప్రియుం
డీమాన్యుండనఁ బేరుగాంచెదఁ బవిత్రేచ్ఛన్ ప్రవర్తించెదన్

పాండవధార్తరాష్ట్రులకు భండన మయ్యెదితప్పఁబోదు త
ద్భండనసీమధర్మజుఁ డపారజయంబునుగాంచి పౌరవే
దండవియద్ధునీగిరిసుతాప్రియకుందమరాళచంద్రికా
పాండురకీర్తిసంపదల భాసిలు నందియ మేల మాధవా!

తమ్ముల్ ఋత్విజులై వెలుంగఁగ సుపద్రష్టత్వముందాల్చి హా
ష్షమ్ముంజూపుచు నీవునిల్వ దృఢదీక్షాకంకణంబూని తే
జమ్మొప్పారఁగ ధార్తరాష్ట్రపశుహింసన్ భీమసంగ్రామ యా
గమ్ముంజేయును ధర్మపుత్త్రుఁడు జగత్కల్యాణసంధాతయై

భాసురపుణ్యమూర్తులగు పాండుకుమారులుగాక దూషితా
భ్యాసులు కౌరవుల్ రణమునందు జయింతురె ? ధర్మమెచ్చట-
వాసిగనుండు నచ్చట ధ్రువంబు జయంబనరొక్కొ పండితా
గ్రేసరులైనవారు నృహరీ ! పెఱమాటలువేయు నేటికిన్ ?

ఎన్నఁడొ కన్నెతీకంబున
నన్నుంగని గొంతి విడిచె నదిఁ బాండవులీ
యన్నమొగం బెఱుఁగరు " మీ
యన్నయ్య " నటంచు నిప్పుడనిన న్నగరే ?

సదమల ధర్మమూర్తియు నజాతవిరోధియునైన ధర్మజుం
డిది వినునేని రాజ్య మతఁడేల గ్రహించును నా కొసంగ, క
య్యది తగునే ? మహామహుఁ డనంతగుణాఢ్యుఁ డతండు సత్యసం
పద లలరార లోకపరిపాలన సేయక యుండు టొప్పునే.

కరుణాపూరితమైన చిత్తమున మత్కల్యాణముంగోరి యి
త్తఱి నీవాడిన మాటలన్నివనక యీ దాసుండు మాఱాడె నే
వెరవుం దోఁపమి ; దీని కల్గకు ననున్ వెన్నాడి నీచక్రియా
చరణాసక్తునిగా నొనర్పకు నమస్కారంబిదే మాధవా !

ఇంక నొకమేలు సేయుమో పంకజాక్ష!
యుష్మదస్మత్ప్రసంగంబు నొక్కమాట
నైన నొరులకుఁజాటక మానసంబు
. నంద నిలుపుము పరమరహస్యమగుట

సెలవు నొసంగవయ్య యదుశేఖర నేనికఁ బోయివత్తు నన్
దలఁపున నిల్పవయ్య, భయదంబగు సంగరసాగరంబు ను
జ్జ్వల భుజశౌర్యనౌక నిరపాయగతిన్ దరియించి నిన్ను న
వ్వల గనుఁగొందుఁ గానియెడ స్వర్గమునం గనుఁగొందు మాధవా!

అకలంక రాజభక్తిం
బ్రకటించుచుఁ గర్ణుఁడిట్లు పలికిన విని నం
దకుమారుఁ డద్భుతానం
ద కీర్ణహృదయంబుతోడఁ దా నిట్లనియెన్

బళిబళి మెచ్చితిం గమలబంధుకుమార! యుదార! నీ సము
జ్జ్వలహృదయంబెఱుంగ నిటుపల్కితి నల్కవహింపకయ్య నీ
విలసితవృత్తమున్ గని వివేకు లహో యనకుందురయ్య ని
ర్మలనిరవద్యకీర్తి నసమానుఁడవై మనవయ్య ధీనిధీ!

అని కర్ణు మెచ్చి కృష్ణుం
డనఘునతని వీడుకొల్పి యర్కజుచరితం
బునకెద నబ్రంపడుచున్
జనెఁ బాండవులున్నయెడకు సరభసగతితోన్

౧౦—౧౩—౩౬

## నే తా జీ

ఇదె మహోదయవేళ యయ్యెను
వదలుమీ యజ్ఞాతవాసము
కదనకేళీ రుద్రమూర్తీ
కదలిరావోయీ !

బ్రతుకు బరువై క్రుంగిపోయిన
గతులు కఱవై దెసలుసూచిన
వెతలమున్గిన తల్లికాఅకై
విక్రమించితివా !

మహిషరక్షో రుధిరమేదో
మగ్నకాళీ మాతృరూపము
దహరసీమ ఘటించి ఖడ్గము
దాల్చి నడిచితివా

జిత్తులన్నిట నందెవైచిన
చేతులే నీయెత్తులోఁబడి
చిత్తుచిత్తై తెల్లవోయిరి
చిన్నవోయిరిగా

## నే తా జీ

దానిసమ్మునఁ గ్రుళ్లి కుమిలిన
బ్రదుకుకంటెను జావు మేలని
షానవాజ్ ధిల్లాను సేగాల్
సేన గూర్చితివా

పొగల పెల్లున సెగల పెంపున
యుగ యుగమ్ములు పెరిఁగి పేరిన
పగలు మానిపి హిందు ముస్లిం
బాట దిద్దితివా

విశ్వభారత వీరకోటికి
శాశ్వత ప్రేమమ్ము గూరిచి
యాశ్వికధ్వజినీ పరంపర
కాజ్ఞ లిచ్చితివా

రక్త తిలకము దిద్ది భారత
రమణి పౌరుషలక్ష్మియై మన
ముక్తికై నీ కన్నుసన్నల
మోహరించెనఁటే

కంటగించిన పోటరులు నీ
కంటి యెట్టిన కాఁగఁజాలక
మంటిబొట్టెలలోన నక్కల
మాడ్కిఁ దూఱిరఁటే

పెద్ద కాపు

ప్రాఁతగాథల నిద్రవోయిన
భారతీయుల సమరచండిమ
లోఁతు లోఁతులు చూపి జగముల
లోభపెట్టితివా

ఎదురు దొరతన మేర్పరించితి
వెదిరిగుండియ గాలమైతివి
కదరుజెండా యెత్తి యిన్నాల్
కదన మూఁపితహో !

చాలుఁ జాలు మహాప్రభూ ! మన
సాహసం బొకసారి చాటితి
హేలగా నీఁక సైఁతు బన్నము
లెన్ని పైకొనినఁ

కట్టుబట్టల నిల్లు వెడలిన
వట్టిమానిస్తి వీవు, రాజ్యము
లెట్టు గెల్చితి, విన్ని మాయల
నెపుడు నేర్చితివో

వెక్కిరించిన రథికమండలి
బిక్కమొగమై డిల్లపోవఁగ
నెక్కితివిరా సర్వమానవ
హృదయ పీఠములఁ

జాతి యొకటే లక్ష్య మొకటే
నేత యొకఁడే దేశమున కని
నీతి నేరిపి మాకు నాశా
జ్యోతి వైతివిరా

తారకం బై మమ్ము లేపెను
దావకము జై హింద నాదము
ఘోరవిక్రమ మూని ఢిల్లీ
కోటగెల్తు మిఁకన్

వీరతాయెతు గట్టినారము
వీరపాణము చేసినారము
లేరు లేరిఁక నడ్డుకోఁగల
వారు మాకెచటన్

భవ్యభారత మధురమూర్తీ
దివ్యభారత సవ్యసాచీ
నవ్యభారత చక్రవర్తీ
నతులు నీ కివిగో

ఆసమై గంగా జలమ్ములు
మోసి తెచ్చిరి, దేశభక్తులు
డాసెరా, యభిషేక లగ్నము
డాఁగవల దింకన్

సాగిరమ్ము స్వతంత్ర హిందూ
సైన్య చక్రక్రమణ నేతా
ఏగఁ దెంచిరి మంగళారతు
లెత్తఁగా మహిళల్

కోసి తెచ్చిన పూలగుత్తులు
గ్రుచ్చి దండలు కట్టినారము
బోసు వీరా ! పూజలందుము
పురుష సూక్తమునన్

పంటమొగ మైనట్టి పొలములు
కొంటె గాలికి దెబ్బ తినెనని
యొంటిపాటున నెచ్చనూర్చుచు
నుంటివా తండ్రీ !

మేటి మగఁటిమి చూపుటొకటే
మెచ్చుకోఁ దగినట్టి పనిరా
ఓటు గెల్పులు సాజముల్ గద
పోటు మానిసికిన్

పండినది నీకీర్తి మురువై
పాలసంద్రము మీఁది నురువై
నిండినదిరా విశ్వజగతీ
ఖండ ఖండములన్

౧౬–౧౦–౪౬

## కృ త మె ఱు క

ఏఁడాదినాఁటి కథ యిది
నాఁడు పురాపాప ఫల మనందగు రుజకే
నోడి పరిణామశూలకు
గోడు గుడుచుచుంటి నెదురుకొనుచుంటి విధిన్

ఏడేండ్లు నన్నునలిపిన
గాడిద యిది సమసిపోయెఁగా యనుకొంచున్
మూఁడేండ్లీడ్చితి బిగిలిన
ప్రోడే చివురించి నేఁడు మొగ్గలు తొడిగెన్

గుఱి తప్పనిపోట్లు తెరల్
తెరలుగ నెసరేఁగు నొప్పి తీవ్రతరంబై
నెఱఁకులు చూడెడిమంటయు
హరిహరి యీనరక మొల్ల నసుహృత్తునకున్

సంధివాతపీడ సరిపోవదని ఘోర
మూలరోగ బాధ చాలదంచు
నిది ప్రయుక్తమయ్యె విధి యింత కఱకరి
వృత్తి నెట్లు వలచె వ్రీడలేక

పెద్దకాపు

ఆ మందని యీ మందని
యేమందుఁ జికిత్స లప్పుడెన్నో నడిచెన్
హోమంబు వినా జాతర
మామయ మడఁగారదయ్యె నావంతేనిన్

వ్యాధులకు వానితాతల
కాధులకుంజిక్కి యిర్వదాఱేండ్ల మహా
బాధలు గుడిచితి నిస్సీ
మాధుర్యలవమ్ములేని మనుగడ గంటిన్

దేశంబులు తిరిగితినా
ఆశంసితమైన భుక్తి నాపోయితినా
దేశికులఁ గొల్చి కవితా
కౌశల్యము గంటినా సుఖం బంటితినా

చెలిమికాండ్ర — చుట్టముల — పెండ్లివేడ్కల
ననుభవింపఁ గంటినా జగమ్ము
పెద్దపీఁటమైవఁ బిలిచిన రచ్చల
కరిగి కరఁగినాఁడనా పొగడ్త

ఈ పాటుపోట్ల కగపడి
నా పొందని చెట్టలుండునా జనిరాశిన్
బాపగ్రహమ్ము కేతువు
కాఁపుర మొనరింప నాదుగతి వేఱగునా

అవిరత చింతావశు నను
గవితా లలితాంగి వలచి కరుణింపనిచో
భవమిది మతెంత బ్రోవఁగ
నవతా లేశమ్ము లేక నవయించెడిదో

ప్రాఁబడిన పున్నె ముంటనో పరమధర్మ
మూర్తి నాతండ్రి యాటనో మూరిఁబోవు
కలిమి నేలెడువారిఁ గ్రేగన్ను వలచు
కక్కసము లేమియుఁ నన్నుఁ గాచె నింత

ప్రకృతమ్మన కిఁక వచ్చెద
నొక మిత్రుఁడు నా లిఖించు నుత్తరమున మా
మక మీ తెవులుం గనుఁగొని
వికలాత్ముఁ డవార్యహార్ద వేల్లితుఁడగుచున్

"ఏలా భేషజ మలమట
పాలై రేలుంబవళ్లు పనవుట మేలా
హేలగదా గోదుమ కీ
ళూలాహంకార మాఱఁజూచుట యన్నన్

జౌరాన్నము లుడుఁగుము గో
క్షీరంబులు గ్రోలు మిదియె సిద్ధౌషధమై
నీ రుగ్భరమ్ము డించు న
పార మనామయము నగ్గపఱుచున్ నీకున్"

అనుచుఁ గమ్మనంప నాతఁ డాయుర్వేద
వేత్తయగుట వాని యుత్తరంబు
నాదరించి నాఁడె గోదుమ లార్జింపఁ
గడఁగి హట్టమెల్ల నడిగినాఁడ

ధరణీఖండము లన్నిట
విరిసి విలయ తాండవంబు వెలయించెడు దు
ర్భర సంగ్రామము దెచ్చిన
కఱవున సుమనమ్ములేద క్రయ్యం బచటన్

కర్తవ్యమేమి యిఁక నీ
యార్తిం దరియించు పెట్టులని యెంచునెడన్
* మూర్తిపురి నది ఫలించిన
వార్తన్ హితుఁడొండు వినిచె వనటం దొలఁచెన్

విలిచి పంపవయ్య వెలకేమి గోదుమల్
కాకుమానిలోనఁ గలవఁటంచు
నప్పికట్ల మన్నయనుఁగుమఱఁది సుబ్బ
రావుకవికి లేఖ వ్రాసినాఁడ

నా యున్కినుండి యచటికిఁ
బోయెడు మోటారునెక్కి పోవు పథికుచే
నీ యుత్తరమిడ ఘట్టము
డాయంజని కొంత తడ పట న్నిలఁ బడితి

* భట్టుమూర్తి

అంత గునగున గర్త్తపుర్యాశనుండి
చిన్నకా రొండు వచ్చి నా యున్నచోట
నాఁగె సది *మృగయాపల్లి కేగుటెఱఁగి
కమ్మనిచ్చితి నందున్న కర్షకునకు

మఱవకు బాబూ! మీ చను
తెరువునఁ గల దప్పికట్లు దీని నచట నె
వ్వరికిచ్చినఁ జాలు నమ
స్కారణంబని పేరికొంటి సదనంబునకుఁ

ముట్టు నిపుడ లేఖ వెట్టిని దోలి మా
మఱఁది యెల్లి గోదుమలను జేర్చు
రొట్టెముక్కతోడ నెట్టెద శూలమ్ము
నంచు మివుల నురవణించుచుంటి

ఆసమెయిఁ మఱునటి నాఁ
డాసాయము కాచుచుంటి నా సాయముకై
నా సంకటపా టింతల
కోసరునా యంచు సెజ్జ నొదిఁగిలఁ బడితిఁ

మెలివేయు కడుపునొప్పికి
విల విల పోవుచుఁ గసాయి విధి దూఱుచు బి
డ్డలఁ జూచి వెచ్చ నూర్చుచు
నలందురుచు నుండ నర్త్త మర్ధము కడచెఁ

---

* వేఁటపాలెము

తలవాకిట నపు డెవరో
నిలిచి ననుం బిలుచునట్టి నినదము వెడలెన్
మెల మెల్లన పర్యంకము
వలనన్ డిగివచ్చి యెవరువా రని యంటిన్

తిల్లికనుబెంచి వాకిలి తెఱచి నిలిచి
లేఁతజాబిల్లి జిగిఁ బుక్కిలించి యుమియు
కదురువల్వల కొకవింతకాంతి నొసఁగు
నగుమొగమువానిఁగంటి నన్గదియువాని

ఇతఁడెవ్వఁడు ననుఁ బిల్వం
గత మేమీ యంచు నైకగతులన్ జనితిన్
నతులు కవీంద్రుల కని విన
మితుఁడై యతఁడిట్లుపల్కె మృదువాక్సరణిన్

చౌదరిగారూ ! తమ కా
పాదించితినోవి నిద్ర పట్టినవేళన్
నాదెస మన్నన చూపుఁడు
మీ దర్శనమౌట నధిగమించితి ముదమున్

మీ బాధ యెట్టులున్నది
బాబూ ! జరరాత్రి కగ్గపడితిరె విధి మీ
కీబెడఁద గూర్చి పైఁబడె
నాఁబోతుంజేసి మురియు నది కట్టఱవన్

ఇవి గోదుమ లవి మిమ్మున్
నవయించెడు తెవులు నణఁచెనా రుగ్ను(డు స
త్కావికింత మేలొదవెనని
మివులం దనివోదు మా_త్త మిత్రులతోడన్

అని చేతిమూట నా ముం
చునిచిన నత్యద్భుతంబహో ! యేమిది యీ
నను మెచ్చు గఱువచరితం
బనఁ గీదృశమంచు నెడఁద హాళహాళివడుచున్

ఏ నాతని కిటు లాడితి
మీ నామంబేమి యేది మీయునికి_యగున్
గ్లానుండితఁడేక్రియ మీ
మానసమునకంటె గోదుమ ల్గొనితేరన్

ఇంద్రజాలమాయె నీకథ నాపాలఁ
గలయొ నిక్కవంబొ కానసైతిఁ
దెలుపు(డయ్య నన్నుఁ గలరూపు వక్కాణ
చేసి యనుడుఁ దనకు డాసి యతఁడు

అప్పికట్లకు నిన్న మీ రనుచునట్టి
కమ్మ నందినవారు మా కారువారె
దారిలో దాని విచ్చిన నేరమొండు
కలదు మాపట్ల సైరింపవలయు మీరు

## పెద్ద కాపు

మీ కృతిని దానయాఖ్యుఁడు
స్వీకృతి గావించునెడ రచించిన కవనం
బా కమ్మకు వెలుపల మధు
రాకృతిమై మెఱయుచున్నయది ముద్రితమై

ఆ పద్యంబులపైఁ గల
తీపియ మమ్మింతదనుకఁ దెచ్చెను వానన్
మీ పొలకువ గని లేఖయు
మీ పంచిన దగునటంచు మే మారయుచున్

మీ రచనమ్ముదెసం గల
గారవమునఁ జేసి తగవుగాకున్నను బ
ల్మాఱది చదివితి, మెఱిఁగితి
మాఱని గోరంబు మిమ్ము నలఁచుట సుకవీ!

జాతికిఁ బ్రాణము వోసిన
కైతను సృష్టించినట్టి కవితల్లజుఁ డీ
రీతిం గుములునె దైవం
బేతత్క్రియకెట్టులోర్చె నిసిరో యంచున్

మాసాహు సాహితీ కవి
తా సంగీతప్రియుం డుదారాశయుఁ డాం
ధ్రీసంతత సేవావ్రత
వాసజ్జీవితుఁడు పెద్ద వనటం దగిలెన్

కవిబుధగాయక గోష్ఠి
భవితవ్యసమాత్తహర్ష పరవశుఁ డగుచున్
దివసములు రాత్రులు రసిక
ప్రవరుండతఁ డొక్కలిప్త పగిదిన్ గడపున్

మీ కృతులు పతివ్రతలని
మీ కవితాప్రౌఢి నిరుపమేయంబని మీ
వాకులవి బాఁకులని మీ
పోకడ నార్జవము ననయుఁబోః యని మెచ్చన్

మెచ్చనివాఁ డెవ్వఁడు కలఁ
డచ్చపు టొయ్యారమునకు నాదరువై వె
ల్గిచ్చిన మీ కృతి — నీర్ష్యకు
మచ్చరమున కంజలించు మానిసి తక్కన్

మఱ్ఱమోయుగ్గద తెల్గువీణియల యుష్మద్రాష్ట్రి గానమ్ము మీ
కొరడాదెబ్బకు దద్దఱిల్లిపడి తెల్గుల్ మేలుకొన్నారహా
పురుషోత్తంసు కథన్ రచించితిరి మా పుణ్యాలకుం బంటఁగా
మఱవంజాలరు మీరు దేశమును ధర్మంబున్ గవిగ్రామణీ!

పరులసిరుల కాసపడి కైతకొగ్గరు
పరమ ధర్మసేవ మరగి కాక
జగము పల్లు పులిసి సొగసెఁబో కృతులిచ్చు
పట్ల మీ వెలార్చు పాడి నరసి

గర్తపురినుండు మేము సత్కీర్తిగన్న
మద్దివంశమునంబుట్టె మా వణిక్కు :
అతఁడు వేంకటసుబ్బరావనెడు పేర
బేర మొనరించు నెల్లసర్కారులందు

నన్ను రాజయ్య యంౘడు ప్రాణమ్మువోలె
నుండు నాతని సరస మిత్రుండ నగుచు
ఠాణకెక్కిన మాధవరడ్డివంశ
మస్మదీయమ్ము వలతుఁ గవ్యర్చ సతము

ఇచటు వీడి నిన్న యే మప్పికట్లలోఁ
బత్రమిచ్చి వేఁటపాలెమేగి
వలయు పనులుసూచి వర్జినియా పొగా
కచటి తిమ్మసంద్రమందు విలిచి

మది నొకమూలడాఁగి మము మాటికి మాటికి హెచ్చరించు మీ
వ్యధను దలంచి గోదుమలు పండినవా ? యిటనంచుఁ గాఁపులం
బదుగురఁ బల్కి వాని నొకపట్టునఁ గాంచి సుమేరుపాదముం
గదిసినయట్ల హర్షణము గంటిమి కొంటిమి నేఁటిమాపటన్

ఇపుడ కొనిపోయి సుమనమ్ము నిచ్చిరమ్ము
కస్తినున్నారు చౌదరిగా రటంచు
బచ్చుతేఁ డంద నిలిచి కారిచ్చి నన్నుఁ
దఋమ నిటువచ్చితిం గవితాతపస్వి

కవులు మిముఁబోనివారు సంఘమునకెల్ల
నర్హణీయులు నిలువేల్పు లగుటఁజేసి
చంద్రునకు నూలిపోగన్న చందమరసి
యిచ్చు నుడుగర దీని గ్రహింపరయ్య

అనుడు నివ్వెరపడి తేఱుకొని యుదారు
లెందఱున్నా రకారణబంధువులు భ
వాదృశులు కవితాకలాప్రవణు లిట్టి
మీకుఁ జెల్లింతు మన్నమోవాకశతము

గాలించియు నొకరూకకు
నోలెఁడు గోదుమలుకల్మి చూడని యీ దు
ష్కాలమ్మునఁ బదిసేరులు
నాలోఁగటఁ గ్రుమ్మరించినారా యవురా

మద్దివారికి సిరులలో నుద్దిలేని
వారికిది బ్రాఁతి గాకపోవచ్చుఁ గాని
యడుగకయ మున్న పంపినయట్టి యీవి
కెంచి వెలకట్టనోపు వాఁడెవఁడు గలఁడు

వానిజీవనమ్ము వంధ్య మా జంతువు
కలిమి రిత్త యతని తెలివి చెత్త
కస్తి నున్నవారిఁ గని విని యెవ్వాఁడు
వెన్న కన్నయై ద్రవింపకుండు

## పెద్దకాపు

నెలయేలయల్లు వెన్నెలతీవపందిళ్ళు రవియేల పఱపు నాఱని వెలుంగు ?
పికమేల క్రోల్చుఁ దేనెకుఁ దేనెయగుపాట ఘనుఁడేల చల్లు ముక్కారుజల్లు
విరియేల పంచు మైమఱపించు నెత్తావి మ్రానేలకాచుఁ గమ్మని ఫలంబు
కవియేల పల్కుఁ జక్కఁదనాల కబ్బమ్ము గాడ్పేల విసరు లోకము చిప్పర్పఁ

గోదువారి దెసన కురిసిరా యీ మేలు
పెరల నేమి కొంచె పఱిచినారె
సాధుశీలురకు నిసర్గ మభ్యర్థితుల్ ,
గాక మున్న తనివి కలుగఁజేఁత

ఈ ఋణము నీఁగరానిది
మీ రమణీయాశయమ్ము మీఁగడ కంటెన్
దేఱిన కీర్తిస్ఫూర్తికిఁ
గారణమై సభలమెప్పు గనునట్టి దగున్

ఏ కవనమ్మున మీరలు
నాకవనమ్మగుచు నిట్లు ననుఁ దన్పితి రా
నాకవనంబిది కూర్మిం
జేకొనుఁడీ నెనరుపాలి చిన్నెగ నిత్తున్

అని వచించుచు నస్మదీయమ్ములయిన
కృతులు సుకృతికి మాధవరెడ్డివంశ
వనధిరాజున కర్పించి వినయపూర్వ
కాంజలులు మద్ది సుబ్బరాయనికిఁ బల్కె

ఇది కౌసరాజువృద్ధు జగదీడ్యగుణోదయుఁ డేలు శీలసం
పద గలగుచ్ఛమా పఱిగపంట యనం దగుకావ్యమా సుధా
సదనము నీ రొసంగినప్రసాదము నీపఱిగన్ భజించి పెం
చెద నిఁకఁ బుట్లుపుట్లు కవిసింహ ! సమున్నతభావరత్నముల్

అని వినీతుఁడు రాజయాహ్వాయుఁడు శబ్ద
మాధురీసాధురీతులు మల్లడింపఁ
బలుకరించుచు విశ్లేషభరము సైఁప
లేక సైఁచుచు వేఁటపాలెమున కరిగె

అపకారము దిగమ్రింగుట
యుపకృతి బాహిరముసేఁత యుచితంబని ధీ
నిపుణులు సెప్పుట వాణీ
కృప నీకఫ కక్షరత్వ మీయంగంటిన్

కావించుమేలు మఱచెడు
దేవానాం ప్రియుల కవమధీబద్ధుల కీ
త్రోవ భయవ్రీడా స
ద్భావశ్రీజనక మొజ్జబంతియు నగుతన్

జయమెసంగుఁ గాత సర్వదా శారదా
పాదకటకనాదసాధుమాధు
రీధురీప్రసూవరీయోంధ్రకవితామ
హోవిధాతృ పూజనోత్సుకులకు

—౨౭—౧—౪౬—

రాయలనాఁ డే నుండినఁ
బాయక నన్నతఁడు గజముపై నిల్పెడివాఁ
డే యనుచుం గూయుదువో
హో! యింతయహంత యేటి కోయీ; కుకవీ!

అపుడె నీవున్నఁ గృష్ణరాయండు నిన్ను
గజముపై నిల్పుననుమాట కల్లగాని
పట్టి నుదుటను సున్నంపుబొట్టు పెట్టి
ఖరముపై నిల్పు నను మాట గట్టిమాట

ఎన్నికం గన్న కవిరాజు లీజగాన
నిద్దఱో ముగ్గురో పుట్టి రింతవఱకు
నందు నేనొక్కరుఁడనంచు నాడెదీవు
గఱువలేమందురో సుంత యెఱుఁగలేవు

"ఏను శాస్త్రంబునకు లొంగనేల భావి
లాక్షణికుఁ డెవ్వఁడో కూర్చు లక్షణంబె
నాకు జోహారు కావించుఁగాక!" యందు
వెప్పుఁ డనఁదగు మాటరా యిది వెడంగ!

విడుపు మీఁకైన నియ్యవమవృత్తము; నుత్తములేగు త్రోవలన్
నడువుము ; పాండితీ ధనసనాథుల సేవలొనర్చి విద్యలన్
బడయుము : గర్వమున్దలఁగి, పాడినెఱింగి, వివేకివై, కడుం
గడు బుధకోటి మెచ్చఁ గవిగణ్యుఁడవై యశమున్గడింపుమా

విను మీవు నన్నుఁ బదరెద
వని యెఱిఁగియు నస్మదీయమగు ధర్మంబున్
గొనియాడితి ! నీ హితమును
మనమం దూహించి దీని మర్మము గనుమా !

౧౦—౫—౩౪

వ్యాకృతి నెఱుంగవైతి మ
హాకవిమార్గంబు లరయవైతి విఁ కేలా
నీకబ్బం బది యంగడి
కాకితములకొఱకుఁ గాక కాకవి ! చెపుమా

ఎవఁ డిచ్చె నీకు భాషా
ప్రవ కవిసింహాదిబిరుదరాజమ్ము లహో !
కవిపాంసన ! పరిహాస్య
వ్యవసాయం బేల బేలవై సల్పె దిటుల్

భావములేక యన్వయముఫక్కి దొలంగి రసాతిదూరమై
యేవముగొల్పుకైత లిఖియించి యిదేమియటన్న దీనినే
భావకవిత్వమందురని పల్కెదు లజ్జరవంతలేదొ ? సీ
సీ విబుధుల్ వినుం బరిహసించు రెఱుంగవో ? కాకవీశ్వరా !

మిండత క్రొత్తడిసుద్దులు
మెండుగ బోధించునట్టి మెయిఁ గావ్యకళా
మండనులకు సత్కవులకు
గండఁడపై తగవుసెప్పఁ గడఁగకు మెప్పుడున్

వడియుం బ్రాసముఁ దొడుగని
తొడవుల్గద తెల్గుకైతతొయ్యలి కేలా
విడనాడ వాని ? నీకీ
పెడబుద్ధు లెవండు నేరిపెన్ గుకపీంద్రా !

తెలుపనేర వీవు తెల్గుబాసకు నచ్చు
లెన్ని గలవొ హల్లు లెన్ని గలవొ
బళిరె ! వీధిలోని బాసయే లోకంబు
నుద్ధరించు నందు వురము సఱచి

౧౨--౨--౩౫

ఊరు నాఁ డిచ్చ మెచ్చి లోకోత్తరునకు
నొకని కరకప్పుటీ యిచ్చు టోర్వలేక
పరులు నాపల్లకీ నేలపట్ట రంచు
నేడ్తువా **లేమి కిమియే హేతువోయి !**

బూతువోలె నీచుఁ బొగడి కుక్కంబలె
నోరువిప్పి పొట్ట బోర చూపి
యేడ్చి గతికినట్టియెంగిలి కిడకు స
త్కార మన్న పేరు కాకవీంద్ర

" వెధవ " పొట్ట కిన్ని వేషములా నీతి
తలదె నరుఁడు కూడు వలచు దమక
ఆస్తికత్వ నాస్తికాచార సామ్రాజ్య
వాద సామ్యవిధుల నూఁదె దీవు

ఏడిచినట్లె యుండెఁ గుకవీశ్వర ! తావకతంత్ర మింత వా
దోడుగ నుందు రన్నమదితో వెడపద్దెము లల్లి యల్లి కి
గ్గాడులపేరు పెట్టెదవె గాడిద గాడిద రుద్దుకొన్నచో
బూడిద రాలుఁ గాని మఱి పుష్పొడి రేఁగదురా దురాశయా !

నీకు విలువలేదు నీ బిరుదమ్ముపై
ముఖ్యులైన కవుల ముద్రలేదు
తగనిపెత్తనమ్ము తలఁదాల్తువేలరా
యొదిఁగి యొదిఁగి మూల నుండలేక

ఆవు నెల్లవారు పూవులఁ బూజించు
టోపలేక వ్రేఁగి యుడికి యుడికి
కుర్కురమ్మునొసట " గో " వని వ్రాసెదే
పరసు లేవగించు సరణి గనక

కుక్క గోవు గాదు కోఁతి నరావతా
రమ్ము గాదు బండి రథము గాదు
ప్రజలు పాలుపైచు పర్యుషితం బేని
నీకు ముట్ట దింత నీతిచెడిన

౧౫—౫—౪౭

# అభినవ తిక్కన కృతులు

| | |
|---|---|
| పెద్దకాపు | ౧-౦-౦ |
| రాష్ట్రగానము | ౧-౦-౦ |
| ధర్మజ్యోతి | ౧-౦-౦ |
| అమరజ్యోతి | ౦-౬-౦ |

## అచ్చులో

పరిగపంట

ఆత్మార్పణము

ఆత్మకథ




రామమోహన గ్రంథమాల

యనమలకుదురు (బెజవాడ పోస్టు)

లేక

తుమ్మల సీతారామమూర్తి చౌదరి

బోర్డు హైస్కూలు పండితుఁడు

అప్పికట్ల (గుంటూరుజిల్లా)